**RAATI CHIGULLU**
(Collection of Poems)

Author :
**Adigopula Venkataratnam**
Nagarjuna University
Guntur - 522 510

First Edition : August, 1998

·Copies : 1000

Cover painting : Srikanth Adigopula



For copies :
Prajasakti Book House
Karl Marx Road
Vijayawada - 520 002 - and all its branches

Visalaandhra Book House
4-1-435, Vignana Bhavan, Bank Street
Hyderabad - 500 001 - and all its branches

Pallavi Publications
Karl Marx Road
Vijayawada - 520 002

Printed at :
Sree Lakshmi Press
14/2 Arundelpet, Guntur

Price : **Rs. 20-00**

ఆత్మీయులు
కర్నాటి లక్ష్మీనరసయ్య గారికి
రవణం శ్రీరాములు గారికి
శీలం దివాకరరావు గారికి

సుహృదుడు
తెలకపల్లి రవి గారికి

కవితల్ని ప్రచురించిన
ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి దిన, వారపత్రికల
ప్రజాశక్తి, విశాలాంధ్ర, ఆంధ్రభూమి దినపత్రికల
ఆహ్వానం, స్రవంతి, ప్రజాసాహితి మాసపత్రికల
సంపాదకులకు.....
హృదయపూర్వక కృతజ్ఞతలు.

**—అడిగోపుల వెంకటరత్నమ్**

# సూచిక :

# వేయి కళ్ళ నిఘా

ప్రయాణం నడుస్తూ వుంటుంది
ఓటమి విజయమౌతున్నప్పుడు
గెలుపు గుత్తాధిపత్యమై గర్జన
అలసట లేని ఆనందం
అవధుల్లేని ఆవేదన నన్ను చుట్టిన వర్తమానం
ప్రియుడా, ప్రేమికుడా, ధీరుడా, విప్లవకారుడా
మనమెప్పుడూ కలుసుకునే వుంటాం
శారీరక సంసర్గమే కలయిక కాదు
చెట్టును గాలి తాకని క్షణం వుండదు.
కదలికలుంటాయి కనురెప్పకు తెలియదు
కనురెప్పలుంటాయి కదలిక వుండదు
వేయి కళ్ళ నిఘాపై ఒంటి కన్ను మాటు నీది.
ఆకు కదిలితే నీ శ్వాస
పక్షి ఎగిరితే నీ అలికిడి
భ్రమ పుట్టి ఆశ రేపుతుంది
తడిపొడి చూపు తడబడకుండా నిలుస్తుంది.
ఒంటరిగా నిల్చిన వాటి వెంట తిరిగే సెలయేరు

అన్నిటికి ప్రాణహిత
నువ్వు పసి పిందైన చోట
కవచాలై కప్పిన ఆకు చేతులు
విస్ఫులింగమై జ్వలించిన చోట
రక్షణ వలయాలై సంధించిన విల్లులు
అభయమై ఎక్కు పెట్టిన బందూకులు.
ప్రియుడా, ప్రేమికుడా, ధీరుడా, విప్లవకారుడా
నేను నిలబడి వుంటాను
నాకు కనబడకుండా చుట్టి వెళ్ళు
నువ్వు నిల్చుని వుంటావు
నీకు తెలియకుండా నిన్ను ప్రదక్షిస్తాను
బాలచంద్రుడికి కర్తవ్య బోధనలో
నేను మాంచాలను
ఉద్యమానికి తల్లిని.... ఊపిరిని.

# ప్రాణయంత్రం

తొలికోడికి ముందో
వేగుచుక్కకు వెనకో
ఉలిక్కిపడ్డ గాఢనిద్ర
మెలకువ మజిలీ వేస్తుంది.
అమ్మ అలికిడి నా చెవులు చేరవేస్తాయి
నిద్రపోలేని బతుకు రెక్కల మోత
ఇల్లంతా మార్మోగుతుంటే
మూసిన కళ్ళతో అమ్మ పరిశ్రమ చూస్తాను.
నిద్రిస్తున్న నా కాళ్ళముందు అమ్మకాళ్ళు
పునరపి జననమౌతాయి
చేతులు అటక మీదకు ఎక్కుతూనో
పాత్రల్లో దూరుతూనో
పచ్చడి బండ మధ్య నలుగుతూనో
కాల్తున్న రొట్టెపై అట్లకాడై మాడుతూనో
మంట మండిస్తూనో
మంటనార్పుతూనో వుంటే
దేహాన్ని దుప్పట్లో చుట్టిన నా చేతులు

పొత్తి కడుపున వొదుగుతాయి.
కేవలం కాలహరణకు ఆమె పెదాలు
లిపికందని భాషను వల్లిస్తుంటే
కడుపు రిజర్వాయర్లో మాటల్ని నిల్వచేసి
నా పెదాలు అనకట్ట కడతాయి.
అమ్మకేదో సాయం చేద్దామనో
ఆమె పరిశ్రమలో
పది పైసల వాటా పంచుకుందామనో
పైకి లేవబోయి
తల్లి మమతా సామ్రాజ్యంలో
కొడుకు సింహాసనం గుర్తొచ్చి
హఠాత్తుగా అధిష్టించి నిద్రలోకి జారుతాను.
మేల్కొల్పే ప్రక్రియలో అమ్మవేళ్ళు
మెల్లగా సుతిమెత్తగా స్పృశిస్తున్నప్పుడు
బద్దకపు నా వొళ్ళు ఆవలింపులు పూస్తుంది.
ఆహార్యం ధరించిన సూర్యుడు
నటనాలయంలో నటిస్తుంటాడు
పగటి జీవనపోరాటానికి రాత్రిభూమిక
అమ్మకు నిండైన నిర్వచనం
పగలు రాత్రి పరిశ్రమించే ప్రాణయంత్రం.

# కట్టెల గూళ్ళు

రూపం అస్థిపంజరమై
ఒక మట్టిగర్భం పండుతుంది
దొర్లుడు పుచ్చకాయలు కాదు గదా
తల్లి గర్భంలోంచి దొర్లడానికి—
ఎముకలు సూదులై చురకత్తులై
గుచ్చి చీల్చి
కట్టెలు కట్టెల్ని కంటాయి.
పుట్టి గిట్టే సూర్యుడ్ని రోజూ కొలిచే
వెర్నియర్ కాలిపర్స్ కొలతల్లో
ఒక్క సెంటీమీటరూ తేడా వుండదు
అతడు అన్ని గ్రహాలకూ ఆదర్శతనయుడు.
పుట్టిన బిడ్డ పరిణామదశ చుట్టూ
ఋతువుల కర్తవ్య నిర్వహణ ప్రారంభం
చిగురించడం, పుష్పించడం, రాలడం—
ఒంటినిట్టాడు మోడుకు
ఎన్ని కొమ్మల కుటుంబాలో
ఎన్నెన్ని ఆకుల బిడ్డలో—

కదుల్తున్న అస్థిపంజరానికి
ఒక కండా చిగురించదు
మొదళ్ళను ఎండగడుతూ తోటమాలి
భగీరథుడ్ని తరుముతూ ఎండమావి.
ఎముకలు వరలై
వొళ్ళంతా కన్నీటి బావి
అభ్యంగన స్నానాల్లో
మునిగి తేలుతూ కళ్ళు
మట్టి పుట్టుక చుట్టూ
దినదిన గండం.
అస్థిపంజర పరిణామ ప్రక్రియలో
రూపం అస్థిపంజరమై
మరో అస్థిపంజరం గర్భం పండుతుంది.
మరణించిన అస్థిపంజరానికి
జన్మించిన అస్థిపంజరం
మళ్ళీ ప్రత్యామ్నాయం—

# పునరపి

విత్తునాది, చెట్టునాది
పొలంనాది, పుట్టనాది
ఊరు వూరంతా నా ఆనవాళ్ళు
సువిశాల దేశం మూరెడు పతాకమై ఆనవాలు
ఎగిరే జెండాలో ఒక అణువు నా ఆనవాలు.
వాడు ప్రశ్నిస్తాడు, గర్జిస్తాడు
ఉరుముతాడు, శిక్షిస్తాడు
చెట్టు గాలికి ఊగితే నేరం
నీరు పల్లానికి పారితే నేరం
ఎదురొచ్చిన గుండెలపై బూట్లు
ఎదురొడ్డిన గుండెలపై బాయినెట్లు.
ఊరు వూరులా లేదు
ఊడ్చిన కల్లంలా వుంది
కంటి మీద కునుకుండదు
యుగాలు గడిచినా రాత్రి తెల్లారదు.
హఠాత్తుగా జొరబడ్డ ఆనవాలు లేనివాడు
నా ఆనవాలు నా యింట ప్రశ్నించి శంకించి

జీర్ణతృణంగా విదిల్చి హేయపరుస్తాడు
ఎంటితో బంధించబడ్డ
ఆశ్వికదళం చూపుతాను
అణువును జేసి హేళన చేస్తాడు
చూపును నుసి చేసిన
రేణువుల జాబితా విప్పుతాను.
వాడి ప్రశ్నకు నేను జవాబు
వాడి ఉరుముకు నేను పిడుగు
వాడి తూటాకు నేను తిరుగుబాటు
గురిపెట్టిన తుపాకి నా గుండెల్లో పేలుతుంది
ఆనవాళ్ళ సమూహం చుట్టూ
మరణమృదంగం
నాకు మరణమెక్కడిది ?

# శ్రీకారానికి ముందు

ప్రాతఃకిరణాల లేత పొద్దు కాదు
మధ్యందిన మార్తాండుని ఉష్ణతరుణము కాదు
మసక చీకట్ల మునిమాపు వేళకాదు.....
కాలంగాని కాలంలో నిర్ఘోష
వేగుచుక్కవేళ మిన్నంటిన డప్పునాదం
ఊరూ వాడా శబ్ద సముద్ర ఘోష
అది మల్లయ్య డప్పు గర్జన.....
తరతరాల వారసత్వపు వీలునామా
మల్లయ్య స్థిరచరాస్తి డప్పు
నిర్దిష్ట వేళలో మల్లయ్య డప్పు
మీసాలపై నిమ్మకాయలు నర్తింపజేస్తే
రాళ్ళు రప్పలు క్షణకాలం జీవం తొడిగేవి
మోరెత్తి కోడెలు పట్టెడ రవళి వినిపించేవి.
నేటి అసాధారణ శబ్దలహరి హేలకు
ఉలిక్కిపడ్డ ప్రజ ఏకాగ్రత కోల్పోయి
అకాలనాదానికి హేతువు వెతుకుతూంది.
ఊరచెరువు చేపల వేలం పాట కాదు

జమాబంది చాటింపు విషయం కాదు
పంటకాల్వ పూడికతీత ప్రకటన కాదు.
కారణాన్వేషణ కార్యక్రమంలో
అకాలనాదం అంతుబట్టడం లేదు
అప్రతిహతమై నాదం సాగుతూంది.
చిర్రా చిటికెన శరీరాలు చిట్లి
పగిలిన వేళ్ళు రక్తపుబేర్లు కట్టాయి
మల్లయ్య మాట్లాడ్డం లేదు
మూసిన కళ్ళతో మౌనంగా
మరోప్రపంచం చూస్తున్నాడు.
గుమిగూడిన ప్రజానీకం
మంత్రముగ్ధమై మూగబోయింది
వేగం తగ్గిన మల్లయ్య మేను మాగన్నుగా మారి
శబ్దం నిశ్శబ్దమై కూర్చుంది
అది వారసత్వపు డప్పుకు రాజీనామా.
మేల్కొన్న జనావళి నోరు మెదపబోయి
ఉదయాద్రిని చూసి ఉలిక్కిపడింది
తూర్పుకొండపై మొలకెత్తిన డప్పు
శబ్దం వినా వెలుగులు చిమ్ముతూ
అరుణారుణ రూపావిష్కరణ చేస్తూంది.

# వీస్తున్న గాలి

ఆలమందలో గోముఖ వ్యాఘ్రం
జలరాశిలో నిగూఢ విషరాశి
ఆశ చుట్టూ అగడ్తల పద్మవ్యూహం.
ఒకటి గుర్రపు స్వారి
సెకండ్లు గంటలు కొలిచిన చరిత్ర సృష్టి,
ఒకటి తాబేలు నడక
రోజులు సంవత్సరాలు కూర్చిన తలగడ.
కత్తి పట్టి ఎదురు నిల్చొని
కలలు కనొద్దంటూ ఒకడి శాసనం.....
ఏది నీ జీవితంలో విస్ఫోటనం
ఏది నీ జ్వలిత చరిత కేతనం ?
విరామ మెరుగక చిగురు
గాల్లో ఈతకొడుతూ శ్రమిస్తూంది
హక్కు ఆయుధం కానప్పుడు
ఫలితం నిర్వీర్యం.
అక్షరాలు నిరక్షరాస్యాలై నిద్రిస్తున్నాయి
ఎంతమంది చేతుల్లో మేల్కొన్నాయి

మరెంతమంది కలాల్లో
సాక్షర కుసుమాలై వికసించాయి?
వేణువు తన ముడి పదార్థాన్ని వెక్కిరిస్తే
ముడి పదార్థం మురళైతేనే దీటైన జవాబు
అద్దె సంతకం అరువు సంతకం మధ్య
మరచిపోయిన సొంత సంతకం.
దిక్కులు మార్చే ఎత్తుగడ సాగనివ్వను
నేను నిల్చింది ముమ్మాటికీ తూర్పుదిక్కు
బొడ్డూడని తూర్పు తల్లి బిడ్డ కదూ
నిశ్శబ్దంగా నా నుదుటిపై దొర్లేది.
శ్వాసలు మొలుస్తున్నాయి
సంకెళ్ళు బ్రద్దలౌతున్నాయి
వీస్తున్న గాలి అంచనాకై
కదుల్తున్న చెట్లే పడికట్టు—

# వెలుగు వెల్లువ

పలకబట్టి బయల్దేరితే
కలువు తీసిన పొలంలా
అమ్మ ముఖం విప్పారి మెరిసేది.
అ ఆ లు రాసిన పలక
అమ్మవేళ్ళకు అందిస్తే
ఏరుకున్న అక్షరాల్ని వొళ్ళో దాచి మురిసేది
అమ్మ రూపం నా రూపానికి అద్ది మాసిపోయాక
పలకా బలపం లేని నా బాల్యం
బడికి స్వస్తి పలికింది.
పసివాడి నగ్నరూపం మొలతాడుగట్టి వీధికెళితే
మొలతాడు లేని మొలల మధ్య మొలతాడే మిన్న
అవయవాల్ని కప్పుతూ గోచి పెట్టినపుడు
గోచీలు లేని గోలీలాటలో గోచీదే ఆధిపత్యం
ఆరు తర్వాత ఎంతకూ గుర్తురాని అంకె కోసం
మోరెత్తిన బడిపిల్లాడ్ని చూసి
ఇరవై గొడ్లను ఏకధాటిగా లెక్కించడం నా విజయగర్వం.
పుల్లతో పంటకాల్వ లోతు కొలిచి

పారబోయే పొలం లెక్కలు ఆశువుగా నా నోట దొర్లేవి
సూర్యగమనం చూసి గంటలు నిర్ధారించినపుడు
గతి తప్పిన గడియారం విస్మయ దృష్టులు పరిచేది.
కాళ్ళకు తగిలిన రాళ్ళను సమగ్రంగా పరిశీలించి
ఏ ఖనిజ సంపద నిక్షిప్తమో ఏకరువు పెట్టేవాడిని
కమ్మిన మబ్బు సాంద్రత బట్టి వర్షపాతపు అంచనాకు
కురవబోయే మేఘం అబ్బురపడేది.
రాతిమీద సుద్దగీతలు రాతలు కానేరవు
కాళ్ళూచేతుల వేళ్ళు లెక్కించడం లెక్కలు కానేకావు.
ఎక్కాల్సిన బస్సు చిరునామా ఎంతకూ చదవలేక
జార్చుకున్న కాలం కాలచక్రంలో శూన్యం
నేర్చిన అక్షరం నక్షత్రాల్ని కోసి తెస్తుందని
మరణించే వరకు మనిషి విద్యార్థేనని
అజ్ఞాన తిమిరాన వెలుగు జల్లుతూ
అక్షరాస్యత శాస్త్రీయ ప్రతిమ అంటూంది.

# ముందడుగు

ఆరంభం లేదు అంకురం లేదు
మూర్నాండి ముక్కలు రాలినట్టు
గానుగెద్దు గుడ్డిగా తిరిగినట్టు
పల్లానికి నీరు పారినట్టు
ఒక యాంత్రిక చలనం
ఒక అసంకల్పిత గమనం.
కర్మభూమి కులాలు
పుణ్యాత్ములు పాపాత్ములు
తలకొరివి పెట్టేంతవరకు
తలరాతను అనుభవించండి.
పుణ్యభూమి రాగాలు
స్వర్గం నరకం
చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత
అనుభవించండి అనుభవించండి.
సాగిపోయే సుఖాల నదులకు
చెదరని కరకట్టలు ఒక వర్గం.
ఎన్నో ఏళ్ళుగా ఏకశిలా రథాన్ని

మానవుడు చెక్కుతూనే వున్నాడు
గుర్రాలు రూపం దాల్చలేదు
సారధి ఇంకా నిరాకారుడే
ఒక అంకిత భావం
ఒక తపస్సు
నిను నిన్నుగా మలుస్తుంది.
బహుదూర ప్రయాణమని భీతి చెంది
బయల్దేరిన చోటే ఆగిపోవడం
అసమర్థుని జైత్రయాత్ర.
పొదుగును దూడ కుదపందే
తల్లి చేపదు
అంగుళాల కలయిక
అడుగులౌతుంది
వేల మైళ్ళ కొలతౌతుంది.
ఆకాశం అందుకున్న వాడికి
సముద్రం మోకాలి లోతు
సూర్యుడ్ని చేరుకున్న వాడికి
భూమి నారింజ పండు.

# అభేద ప్రశ్న

వేయి పుట్ల నిద్ర నెత్తికెత్తుకుని పరుగెత్తి
నీరో చక్రర్తిలా నిల్చివున్న నిన్ను చూసి
పాలవాడి చేతి పాలపొట్లం అందుకుంటాను.
ఉషోదయ వార్తాప్రపంచంలో రక్తసిక్త చిత్రం దగ్గర
సంకల్పితంగానో అసంకల్పితంగానో నా చూపు ఆగితే
ఆనక ఊళ్ళేలవచ్చు అన్నం వండమని
పేపరు మడుస్తూ నీ ప్రబోధ వాక్యం.
అలిసి కోపించిన వంటపాత్రలు నన్ను కాల్చితే
వంటింటి గాయాలు ఇల్లాలికి మామూలన్న ప్రకటన.
వడ్డించిన వేడి అన్నానికి వేళ్ళు తగలకముందే
ఆగ్రహించి విప్పిన బూతుపంచాంగం ముందు
నా చేతి గాయం స్త్రీ జాతికి పెట్టుమచ్చ.
కుర్చీ సింహాసనంపై ఠీవి వొలకబోస్తూ కూర్చొని
కదిపిన నీ కాళ్ళకింద నేను కసువు చిమ్ముతూ
తగిలిన పొరకట్టను చూసి
అపర దుర్వాసుడవై అవతారమెత్తితే
సూది కైవారం చీపురుకట్టకై

కంప్యూటర్ యుగాన్ని కరుణించమంటాను.
కుర్చీలకు మంచాలకు నీ సోమరితనం చుట్టుకుంది
అన్ని వస్తువుల్నీ నీ అనుమానం ఆక్రమించింది
స్త్రీలకు ఉలుకెందుకు, పలుకెందుకు
మనసెందుకు, ఆలోచనెందుకు
చీకట్లో ప్రవహించి పడకటింట్లో వెన్నెలై ఉప్పొంగే
నిశ్శబ్ద నిమజ్జనం నీ అభీష్టం.
వాకిట్లో నిలబడతాను
గోధూళి చూస్తాను, పక్షుల్ని చూస్తాను
సూర్యచంద్రుల డ్యూటీ మార్పిడి చూస్తాను
చంద్రుడు ధవళవస్త్రం కప్పి పడకెయ్యడం చూస్తాను.
ఎవరికోసం నిల్చొని ఎదురుచూస్తున్నావంటావు
సమఉజ్జీనై ముఖాముఖి ప్రశ్నిస్తాను
ఎవరెవర్ని నిశిరాత్రి కలిసివచ్చావంటాను
పురుషులకు స్త్రీలకు ప్రశ్నలు ఒక్కటే
స్త్రీ పురుషుల జననం ఒక్కటే.

# తడిమంట

తడబడే కాళ్ళకు ప్రతిగా
కళ్ళు తత్తరపాటు
వణికే చేతులకు ప్రతిచర్యగా
కళ్ళు బిత్తరచూపు
శరీర సముద్రంలో కళ్ళు
నిరంతర సంచార నౌకలు
ఏ రుగ్మత ఎదుర్కొన్నా
కంటిపడవ అశ్రు సముద్రంలో మునక.
ఇంకిన ధరిత్రి కన్నీరు
భూగర్భ నదులై సముద్ర సంగమం
నవ్వుల కోనేటి నీళ్ళు
దుఃఖపు జలాశయానికి వలసెళ్ళితే
నవ్వడానికి నవ్వెక్కడిది?
రసాయన పరీక్షలో కన్నీటికోరూపం
కన్నీరు ఘన పదార్థమైతే
రాసులు పోసి తూమకొందురు
కన్నీరు బిందువైతే

ముత్యాల సరాలు పేర్చుకొందురు.
వందేమాతరం నేపథ్యం కన్నీరు
సుఫలానికి కన్నీరు సుజలం.
రెప్పతల్లి మాటున దాగి
భీతిలో కన్ను కువకువలాడితే
ఓదార్పు ఉగ్గుబోసిన తల్లి
కంటి బిడ్డకు కదనరంగం చూపుతుంది.
కన్నీటి వర్షానికే కన్ను పరిమితం కాదు
ఏడుస్తూ నడుస్తూ చరిత్ర ఒక రోజు
రక్తాభిరామమై పట్టాభిషిక్తం
సువర్ణాక్షరాల శుభారంభం.
ఎదిర్చి నిల్చిన గొడుగుల్ని కూలుస్తూ
కన్నీరు వడగళ్ళు కురుస్తుంది
పిడుగులు రాలుస్తుంది.
ఇన్నాళ్ళూ తడిసిన కళ్ళ పొయ్యిని
ఎర్రెర్రగా రాజుకోమంటున్నాను.

# వందేమాతరం

అంతరాంతర జ్ఞాపకాల్ని
వయసుడిగిన నేను నెమరేస్తే
తొలకరి వాన నన్ను తడిపేస్తుంది
ఎద పగిలిన జ్ఞాపకం
మాటకందని మౌనం
అది సజీవ వర్ణ కాన్వాసు.
ఎన్నింటిని కంటితో నివేదించేది
ఎన్నని మనసులో ప్రతిధ్వనించేది?
స్వాతంత్ర్యం సంగ్రామమయ్యాక
నా వొళ్ళంతా లాఠీల ప్రతిరూపం
స్మృతి వచ్చిపోయే స్థితిలో
ఒకానొక కార్డు ముక్క కబురు
నా అర్ధాంగి అకాల మరణం.
ఆమరణ నిరాహారదీక్ష
మాతృభూమికి నే రాసిచ్చిన
రక్తాక్షర వీలునామా.....
కఠిన కారాగారవాసం

తల్లి స్వేచ్ఛకు నే పొందిన
చిత్రాతి చిత్రహింస.
ఉరికొయ్యకు ఊగి ఊగి
ఆగిన వీరుని ఊపిర్లో
నేలంతా పిగిలిన ఉద్యమకారులు
నూలువడికి నేత నేసి
స్వదేశీ వస్తు ఆవిష్కరణ
విదేశీ వస్తు బహిష్కరణ
తల్లి భారతికి నే తీర్చిన ఋణం.
ఆనాటి పోలీసు స్టేషను ఆక్రమణ
స్వాతంత్ర్యం సిద్ధించినంత సందడి
వీరోచిత గాథ పారాణి ఆరకముందే
నా కుమారుని ఆకస్మిక అస్తమయం.
దుఃఖం వెల్లువై నా తల్లిదండ్రుల
యాదృచ్ఛిక మరణం
సకాలంలో చేరని వార్త.
నెమరేసిన జ్ఞాపకం
పండిన వయస్సును వెనక్కు పరుగెత్తించి
కాయగా మారుస్తుంది
కాలాన్ని స్తంభిస్తుంది
శాశ్వత శిలాఫలకమౌతుంది.

# పరాజిత ప్రతిఘటన

వరకట్నపు వార్త లోగిట్లో
మావారు రోజా
ముద్రించని పెళ్ళి పత్రిక
మామ ఆకాశ పందిరి
అత్త భూదేవి అరుగు.
బాధల మధ్య బాల్యస్మృతి ఉపశమనం
చాక్లెటు సగం కొరికి చెల్లికి పంచిన క్షణం
రెండు గుండెలు ఒకటై స్పందన
వంతుల వారీ అరకొర జీవితంలో
నా వంతు దుస్తుల కొనుగోలు సంబరపు సౌరభం
నేటికి వసివాడని గుబాళింపు.
తెల్లార్లూ ఒళ్ళో గువ్వయిన భర్త
తెల్లారే పులిపంజా విసరడం
మానవ మృగ జన్యులక్షణ విశేషం
ఖడ్గమృగం కొమ్ములు త్రిశూలం చూపులు
వరాహం కోరలు మనిషి మర్మ నేపథ్యం.
చేతలు నడకల మధ్య

అనురాగం ఆత్మీయతల మధ్య
సరిహద్దులు విభజనరేఖలు
సమాంతరాలు వక్రరేఖలు.
మనసు తూస్తున్న మనుషుల మధ్య
గెలుపు భవనానికి
ఓటమి పునాదులు
గాయం మానక ముందే గాయం
పరాజిత ప్రతిఘటన—
నల్దిక్కులా వలపన్నితే
ఐదవ దిక్కు ఆకాశంపై ఆశ.
ఉత్తరం కొసమెరుపుగా
నీకు తెలియని నిజం చెప్పనా నాన్నా
ఒక రోజు ఆత్మహత్య వార్తైతాను
తల పంకాకు వేలాడుతూ
కాళ్ళు నేలను ముద్దాడుతూ సాక్ష్యం.
కన్నీటి ఏరై యిక్కడకు ప్రవహిస్తావు
కపట శోకతటాకాలు నిలగట్టి వుంటాయి
అనూహ్య సంగమం జరిగిందా
కథ కాంచీపురానికి
వియ్యంకుడు మళ్ళీ విడిదింటికి—
ఆశ ఆకాశం తాకిన నక్షత్రాల చెట్టు.

# అర్థశతాబ్ది స్వాతంత్ర్యం

యాభైయ్యేళ్ళ స్వాతంత్ర్యానికి
అర్థశతాబ్ది ఉత్సవాలు
అందరికీ ఆహ్వానం
మామిడి తోరణాల పసిడి మండపాల
పరిమళ పుష్పమాలికల స్వాగతాంజలి
దయచేయండి దయచేయండి—
స్వాతంత్ర్యం జన్మహక్కని
అసువులు బాసిన త్యాగధనుల సాక్షిగా
స్వార్థమయ స్వాతంత్ర్యం మనది.
ఆడించేది ఒక్కడే
ఆడేది కోకొల్లలు
అడిగేందుకు హక్కులేదు
అణిచేందుకు హక్కుభుక్తం
నిండు బతుకుల మధ్య ఎండిన బతుకులు
కొండల పక్కన చిరురప్పల చిరునామాలు
చేతులు యాచనకే అంకితం
మాటలు అర్థింపుకే పరిమితం

అవినీతి, దోపిడి, దౌర్జన్యాలు జాతీయం.
గంగా గోదావరుల నిత్యజీవధారలో
పవిత్ర భారతి పదఘట్టన రవళులు మృగ్యం
న్యాయాన్యాయ నిర్ణయాధికార పీఠం పై
న్యాయదేవత ఆశ్రిత పక్షపాతం.
అధర్మం రహదారి ప్రయాణం
ధర్మం సందుగొందుల సంచారం
మాటలు రానివాడు పాటలు పాడుతాడు
నడకలు లేనివాడు పరుగులు తీస్తాడు
చదువు రానివాడు ఉద్గ్రంథాలు రాస్తాడు.
ఆసేతు హిమాచలం ఒక్క కుటుంబం కాదు
వేరు కుంపట్ల వేర్పాటు వాద నిలయం
మతాల రణక్షేత్రం కులాల కురుక్షేత్రం
ఆగని ఆరని కయ్యాల ఉలిపి కట్టె నెయ్యం.
తప్పు ఒప్పుగా చిత్రీకరణలో ఐకమత్యం
ఒప్పు తప్పుగా ఒప్పించడంలో సఫలీకృతం
పుణ్యభూమి చిగురుకు చీడ
కూకటి వేరుకు క్రిమి చుట్టుకుంది.
అర్ధశతాబ్ది స్వాతంత్ర్యానికి జయమంగళం పాడి
మళ్ళీ మొక్కను నాటి లెక్కను ప్రారంభిద్దాం
మరో స్వాతంత్ర్యం మనం పంచుదాం.

# అతడ్ని కల్సుకోవాలి

అరచేతి దుప్పట్లో అభాగ్యుల తలలు
ఫుట్‌పాత్‌ల పై ఒదిగున్న రాత్రి
రోడ్లను నిద్రలేపే వాళ్ళూ
నిద్రలేవని సమయమది.
దోపిడి దౌర్జన్యం అవినీతి పై
సారించిన నారి అతడు
అతడ్ని కల్సుకోవాలి.
పాదానికి రోడ్డుకు మధ్య
మంచు బిందువులు నలుగుతున్నాయి.
అతడు నీటికి అడ్డాల బిడ్డ
ఉప్పెనలు, సుడిగుండాలు
ఆరు నిలువుల లోతు నీళ్ళూ అతడ్ని
నిబ్బరంగా నింపాదిగా దాటిస్తాయి.
అతడు గాలికి పురిటి బిడ్డ
పైరగాలి, హోరుగాలి
సుడిగాలి, తుఫాను
అన్ని గాలులు అతనికి సైదోడు.

అతడు అడవికి చనుబాల బిడ్డ
శత్రువు నిఘా పై నిఘా
ఎత్తుకు పైయ్యెత్తు వేసి
అడివి అతనికి కాపలా.
విజ్ఞానం, ఆశయం, సిద్ధాంతం
ఉద్యమాల సమాహారం
అతడ్ని కల్సుకోవాలి.
పాటలు, అనుభవాలు
జయాపజయాల అనుభూతికి
మళ్ళీ ఎప్పుడో ఎక్కడో
ఏ రూపులో ఏ వయసులో—
అతడి ఊపిరి - నీది నాది
చెట్టుది, పుట్టది, అందరిదీ
అతడ్ని కల్సుకోవాలి.
గది తెరిచే వుంది ... అంతా నిర్మానుష్యం
సూర్యుడ్ని మరిపిస్తూ వెలుగు వెల్లువ
ఇంకా ఆరని పాద ముద్రలు
నడుం విరిగి లేస్తున్న కాగితాలు
అక్కడి కాల సూచికలు
ఒక్క వస్తువును వంద చేతులు
ఒక్క కాగితాన్ని వేల చూపులు
పరీక్షించిన గుర్తులు.
అర్ధాంతరంగా అతడ్ని రాల్చకముందే
అత్యవసరంగా జాడ తెల్సుకోవాలి
అతడ్ని కల్సుకోవాలి.

# రాతి చిగుళ్ళు

రాతిని నమ్ముకుంటాను
శిల్పం యిస్తుంది
నీటిని నమ్ముకుంటాను
హరితం పూస్తుంది
గాలిని నమ్ముకుంటాను
ప్రాణం పోస్తుంది.
రాయి శిల్పమై
కరుణ కురిపిస్తుంది
మనిషి రాయై
అగ్ని వర్షిస్తాడు.
విశాల సముద్రాన్ని పిడికిట్లో యిమిడ్చి
ఆశ్చర్యం అవధులు మీరేలోగా
అంత సముద్రాన్నీ బిందువుగా మారుస్తాడు.
చిటారు కొమ్మను శరణుకోరి
తెగిపడ్డ గాలిపటం
ఉగ్గబట్టి ప్రాణం వూగుతుంటే
కొమ్మను తుంచి దుష్టహస్తం

నిర్లజ్జగా నేలపాలు చేస్తుంది.
విధ్వంసకుడి వడిసెల వేటుకు
అర్ధరాత్రి జడివానలో
ఆకుల్లో ఈనెలై వొదిగిన పక్షులు
రెక్కలాడక అల్లాడుతూ గాల్లో ఈతలు.
గ్రాసం లేక మూగజీవులు జీవచ్ఛవాలై
బందెల దొడ్లో బందిఖానా
నోరున్న జీవుల ఘాతుకాలు.
రాతికి నమస్కరిస్తాను
శిల్పమై చిగురించినందుకు
నృత్యమై రవళించినందుకు—
మనిషిని సంస్కరిస్తాను
హృదిలో సుధలు చిందేందుకు
మదిలో మమతలు పండేందుకు—

# బట్టబయలు బందీ

శ్రీ చక్రం ముగ్గు
వెన్నెల వాకిట ఓ కళాఖండం
ఆమె చేతి మహత్త్వం
కళకు అన్నీ వస్తువులే.
అత్తల ఆడపడుచుల
అభినందన సగర్వంగా ధరించి
ఆమె నవ్వుతుంది
విరియని మల్లెలు ఆమె పలువరస
విరిసిన గులాబి ముఖవర్చస్సు
ఆనంద తరంగంపై తేలిన ఆమెకు
సనసన్నని మందలింపు
ఆమె ముఖం మారేడుకాయ
చూపు వాడిరాలిన పూరేకు.

..........

ఆమె స్వరం లయబద్ధం
బడినేర్పని చదువు ఆమె
భావానికి రూపం ఆమె

వరకట్న రుగ్మత పై
స్పందించిన ఆమెకు
సుతిమెత్తని హెచ్చరిక
మాట మనసులో దాగి
మూగబోతుంది ఆమె.

..........

ఆమె ముగ్ధమోహన లావణ్యం
ధరించిన దుస్తులకే అందం
అందానికి నడక ద్విగుణీకృతమై
రాజహంసలా నడిచే ఆమెకు
వినీ వినపడని ఆజ్ఞ
నరాలు నీరసించి
కూలబడుతుంది ఆమె.

..........

ఆమె చూపు సూక్ష్మాతి సూక్ష్మం
మంచికి కారుణ్యమై
చెడుకు రౌద్రమైన ఆమెకు
మెలమెల్లని అనుశాసనం
కళ్ళు రెప్పల్లో దాగి
అంధకార మౌతుంది ఆమె.

..........

ఆజ్ఞ అనుశాసనం
సన్నని మందలింపుల
సుతిమెత్తని హెచ్చరికల
పురుషాధిక్య ప్రపంచంలో
బట్టబయలు ఖంది ఆమె.

# గళం విప్పిన కాలహరణం

హిమసమూహాల చల్లదనం మల్లె రేకుల తెల్లదనం సాక్షి
పరిశోధన కందని ప్రశ్నిస్తున్నాను క్షమించండి
మేధకందని ప్రహేళికిస్తున్నాను మన్నించండి.
తెగిపడ్డ అవయవం ఏకులానిది
కారిపారిన రక్తం ఏ జాతిది?
తెలియవుగాక తెలియవు.
ఊరి వూరికో వాడ నిర్మాణం
కొమ్మరెమ్మల ఫలితం పూవంటే
కొమ్మ వినా రెమ్మలేదని అపహాస్యభాషణం
ఊరు వూరంతా వాడపై విధ్వంసం
ఎంతసేపూ పర్యాయపదాల
ద్వంద్వార్థాల, వ్యంగ్యార్థాలపట్టాభిషేకం.
గంగా గోదావరి కృష్ణా కావేరీలను
మలేసి, నిలేసి, ఎగేసి ఎదురీది
పరివాహిక భూమిపై పచ్చదనం కాయించి
నీటి ఊట చూడని కడగొట్టు భూములం.
ఆడుతున్న నెమళ్ళకు, పాడుతున్న కోకిళ్ళకు

కాళ్ళతో రాళ్ళతో ఛీత్కార సత్కారం
నన్ను వేరుపరచి గాయపరచి
నువ్వాడే ఆట ముసలం.
న్యాయం ఖుకాయించిన చోట
వెలుగు వెల్లువ దివ్యోద్భవం
వాడను వెంటాడి వేటాడే విఘాతీ
శరీరం వద్దులే కాస్త తల తిప్పి చూడు
రొమ్ము విరిచిన నీ వెన్నుకు
బాణం ఎక్కు పెట్టి వుంది.
సిందూరం ఎర్రదనం సాక్షి
మనోవాయువేగాల్లో
ఏది అత్యంత తీవ్రమో నీకు ఎరుకే.

# ఎగరేసిన బావుటా

పిండి బొమ్మగా మారినచోట
బొమ్మను పిండి చెయ్యడమే పని
జైలు నోరు తెరిచే వుంటుంది.
జైలు ప్రణాళికల్ని తిని బలుస్తుంది
పలుగుపారల దాడి జయించి
డైనమైట్ల పోటీగా నిలుస్తుంది.
నడిచే నదికి కరకట్టలు రక్షణ
నడవని సర్కారీకి జైళ్ళు సంరక్షణ.
ఏనుక్కి కందకం, లేడికి వల
కవులు, గాయకులు, మేధావులు
ఉద్యమకారులు, ఉప్పెనైనవారు
అందరూ.....అన్నీ బందీకృతం.
శీతలగదుల్లో మేను మరిచిన వాడికి
కాలికింద కార్పెటు వాడికి
కుబేరుడు తాకట్టుపడ్డ వాడికి
కలొచ్చి ఉలిక్కిపడకుండా
కలతనిద్ర లేకుండా

జైలు నోరు తెరిచే వుంటుంది.
కట్టుకథ కేసులో నేను విడుదల
కల్పితకేసులో మళ్ళీ రిమాండు
ఎక్కడ్నుంచి వచ్చి వాల్తుందో పక్షి
కిటికీ నిండా స్వేచ్ఛ పండిస్తుంది
చిటికెడు తిండి నోట కరిచి
ఆకాశం హద్దు చేసుకుంటుంది.
చినిగిన వెల్ల పరప్రభుత్వ పీడన స్ఫురింపు
చితికిన నేల మాతృభూమి కర్కశ వేధింపు
సూర్యుడి దూత స్వర్ణకిరణం రగిలి
గది నిండా చింతనిప్పుల కాన్వాసు చిత్రం
జైలు పేలుతుంది......
శకలాలుగా, అణువులుగా—
జైలు మృత్యుముఖం కాదు
జ్ఞాన జనన మందిరం
బందీ ఎగరేసిన బావుటా.....

# గుండె నిండిన పాట

పాటకు కుడి ఎడమల్లేవు
ఆకాశం మీద, సముద్రం మీద
నదుల మీద, పొలాల మీద
ఎడారుల మీద, మానవాళి మీద
గుండెనిండిన పచ్చదనంతో
పాడుకుంటూ పరుగెత్తాలి పాట.
ఎందుకో పాటకు రంగులేదు
మరెందుకో చలనం లేదు.
ఊపిరాడక ఉక్కబోస్తూంది
ఎవరో గాలిని తోలుకెళ్తున్నారు
ఎండిన నోరు ఎక్కిళ్ళు వేస్తూంది
ఎవరో నీటిని మలేస్తున్నారు
వర్తమానం స్ఫటికమై కళ్ళల్లో గూడుగట్టి
రోదన రోడ్డు నడిబొడ్డుపై నడక.
వేదన వేణువులో నిండి
పెల్లుబికి రంధ్రాల్లో ప్రవహిస్తూంది
వీణ కడుపులో దుఃఖం దాగి

తీగ పెదాలు వణుకుతున్నాయి.
కోటలు అంతఃపురాలు ఎన్నో కూలాయి
ఒక్క సిపాయి రక్షించిన రాజ్యాలెన్ని
రాణుల ప్రాణం కాచిన చెలికత్తెలెందరు?
నిన్నటి కథ బొత్తిగా జ్ఞప్తి లేదు
నిండిన కడుపుకు మంట గుర్తురాదు
శరశయ్యలపై క్షతగాత్రులు
వసుధ వెన్నున రాచపుండ్లు
సంతోషామృతానికి
దుఃఖసాగర మథనం.
గుండె తెరిస్తే కవిత్వం లావా
మూస్తే కవిత్వం బడబాగ్ని
నేను సమూహం
సమూహాల శబ్దం
నేను శబ్దాల యుద్ధభేరి
కదన రంగాన ఖడ్గం
నేను గుండెనిండిన పాట.

# కీలు తప్పిన వెన్నెముక

అన్ని పండుగల ఆర్థిక మూలవేదిక
అన్ని వర్గాల ఏకైక పర్వదినం ఏరువాక
ఆశల పంటకై బీజం వేసి
ఊరంతా వుత్సాహం వుప్పొంగే పండుగ.
నాగలి తెచ్చిన కర్రును పదును చేసి
సాదరంగా కొలిమి సాగనంపుతూ
పచ్చపచ్చగా నువ్వు పండితేనే
ఎర్రెర్రని మంట నాకంకితమంటుంది.
మేడికి కాడికి కట్లుకట్టిన ఉలి
పుట్లకు పుట్లు కల్లాల్లో రాల్తేనే
నా పరిచర్యకు పారితోషికమంటుంది.
చిలకపచ్చ ముక్కుతాళ్ళు
చిరుమువ్వల పట్టెళ్ళు
గంగడోలు సోయగాల దుక్కిటెద్దులు
ఎలపట దాపట సమవుజ్జీలై
ఏరువాకకు గంతులేస్తూ
నందికేశులై రంకెలేస్తాయి.

వాకిట మామిడితోరణాలు
ఇంటిల్లిపాదీ అభ్యంగనస్నానాలు
ముంగిట కళ్ళాపి చల్లి
ముత్యాలముగ్గు అలంకరణలు.
పెళ్ళినాటి పట్టుచీర
చంద్రాకార సిందూరబొట్టు
అష్టలక్ష్మిగా ఎదురైన ఇంటి ముత్తైదువను చూసి
హలాలు పట్టిన కర్షకులు
పొలాలకు పయనం.
కర్రు తగిలిన నేల పువ్వులా విచ్చుతుంది
విత్తిన నేల హరితమై రూపెత్తుతుంది
నాటి నుండి కర్షకుడి కష్టాలు ఆరంభం
పల్లవించిన హరితం
విప్లవించకనే అనావృష్టి
ఆరుగాలం కష్టించి పండించిన పంట
ఇంటికి చేరకనే అతివృష్టి.
మట్టిని నమ్మిన రైతుకు
ఒట్టి చేతుల మట్టివోడ్కోలు.

# అసంపూర్ణ గీతం

అల్లిన కథ ఆశువై ప్రవాహం
కళ్ళకు గంతకట్టి న్యాయదేవత
అర్ధరార్ధరని అబద్ధాలు ఏర్చికూర్చి
ఆయువు నియంత్రించి
లలాట లిఖితమంటుంది.
రాజ్యాంగం నల్లబజారు వ్యాపారం
పదవీ హోదాల అమ్మకం
మూడు సింహాల పాలన ముంచెత్తుతూంది
బుద్ధం శరణం గచ్ఛామి మార్మోగుతూంది
సత్యాగ్రహం గుమ్మడి తీగై అల్లుకొంటూ వుంది
నన్ను తూకం వేసుకుంటూ నడుస్తాను
పట్టుమని పది కేజీలు తూగను.
ఒకడు దేశద్రోహి, ఒకడు స్మగ్లర్
ఒకడు బందిపోటు, ఒకడు వంచకుడు
ఒక్కడూ చట్టానికి చిక్కడు.
ముద్దాయి స్థానంలో
రెడీమేడ్ ముద్దాయిన్నేను

కొలతలు కాస్త అటూ యిటూ మారినా
కాగితంపై పకడ్బందీగా సరిదిద్దబడతాయి
సుడిగాలులు, చిత్రవధలు నా పరం
వింజామరలు, సుఖరాత్రులు వాళ్ళవి.
బలపం పట్టి పలక లేదని ఏడ్చే కొడుక్కి
వాకిట కళ్ళతికించి ఎదురు చూసే భార్యకు
పై కప్పు తప్పు పక్కకు చూళ్ళేని అమ్మకు
నా వార్త చేరదు గాక చేరదు
శివరాత్రులు శివభక్తులకే పరిమితం.
అన్నీ మొక్కలే .....
మొక్కలన్నీ ఒకటికాదు
ఇన్నేళ్ళ గులాబి రాజసం చిన్నబోయింది
మోదుగు ఎరుపు రంగు ముందు మోకరిల్లింది
తన కూత మధురాతి మధురమని
కోకిలకు తెలిసిపోయింది.

# శ్వేతహాసం

నన్ను నేను వెతుక్కునేలోగా వల్లో చిక్కి
ముత్యపు చిప్పనయ్యాను
పొంగిపొర్లిన విశ్వాసం ఒకానొక రోజు
అప్రమత్తతను ప్రమత్తతలోకి జార్చింది
పొరపాటుకు మూల్యం నవమాసాలు
ఇంటా బయటా చిరునామా
ఇన్నాళ్ళూ రాసినవాడే చెరిపి
బంగారు పిచ్చుకై వెండి భవంతికి ప్రవేశం.
శకుంతలను కాలేదు
కణ్వమహాముని ఎక్కడ?
ఆనవాళ్ళు చూపలేదు
అంగుళ్యాభరణమేది?
ఊసులు బాసలు అటకెక్కాయి
అవమానం ఆపై నువ్వూ
నాకు పుట్టిన కవల పిల్లలు.
కన్నా! బోసినవ్వులు పూసి
ఏడేడు లోకాలు వెదజల్లుతావు

నీ శ్వేతహాసం చూసి
తెల్లదనం దాచుకుంటాయి మల్లెలు
కేరింత రాగాలు విని
మూతబడతాయి కోకిళ్ళ నోళ్ళు
విరిసిన చిరుపాదాల్ని చూసి
వెలవెలబోతుంది వెయిరేకుల కమలం.
అమ్మకు అత్తకు నీది ఒకే పిలుపు
అన్వయించి అర్థం చేసుకోవడంలో
ఆనందం ఇమిడి వుంది
ఎన్నని మేము లెక్కించేము
ఎన్నని మేము గుర్తించేము:
అరిషడ్వర్గాల కావల నీ ఉనికి
సప్త వ్యసనాల కీవల మా స్తబ్ధత
నీ ఆటపాటలు నన్ను బంధించి
కాలాన్ని మూటగట్టి పడేస్తాయి
నువ్వే కొలువు దీరిన చోట
ఆకలుండదు దాహముండదు.
నీ నిండు పున్నమి ముద్దాడని
నీ పొత్తిళ్ళ పొర్లింతలు చూళ్ళేని
నీ తండ్రిదెంత దురదృష్టమో......
నాకు నువ్వు నీకు నేనున్నాను
నన్నెవరు జయించగలరు?

# మారని దృశ్యం

నది పొత్తిళ్ళలోనే నా పెంపకం
నదీగర్భాన చేపనై ఈదాను
నీటిలో నీరై కలసి పారాను
ఇసుకను ఎత్తిన పసితనపు పిడికిళ్ళు చూసి
"ముందుందిలే మోయలేని భారం"
నా తల్లి నది నవ్వుతూ అనేది.
పచ్చని పైర్లను చూసి ముచ్చటపడి
నది పొంగి పొర్లి దొర్లేది
చనిపోయిన పంటబిడ్డల శవాలపై బడి
రోదించి చిక్కి శల్యమై
ఒడ్డు మంచానికి అతుక్కుపోయేది
గుడిసె మునిగి వరద బాధితుణ్ణైన నాడు
చేపనై ఒడ్డున కొట్టుమిట్టాడిన నాడు
కష్టాల జాబితాలో పద్దులు రాసుకున్నా.
ఒళ్ళు కాలిన ఇసుక మేటకు
క్షణకాలం నా చెమట బిందువులు వూరట
బట్టల్తో పాటు బాధల్నీ ఆరేస్తే
ఒడ్డుపై నా కన్నీటి కోత—
ఆనకట్ట, వంతెనలు ఆవిష్కరణై

ద్వారబంధాల్లా నదీతీరాలు తీర్చబడి
మొట్టమొదటి రైలు బల్లిలా పాకినపుడు
నా అరచేతులే పట్టాలై ఆనందించాను.
మహత్తర వారథి నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరో అన్న ప్రశ్నకు
పేరు పేరున బారులు తీరిన మాకు
అధినాయకుడి ప్రశంస ఆకలి తీర్చలేదు.
ఒకడి ఉద్ధరణ కోసం ఒక కట్టడం
ఫకీర్ని పాదుషా చేసే ప్రక్రియ
దృశ్యం ఒక్కటే మరింత తెల్లని తెలుపు.
మారిన నదీ రూపం ముందు
మారని మా రూపురేఖలు
చింపిరి జుట్టూ చినిగిన బట్టా
బక్కచిక్కిన శరీరం — అంతే అంతే.
ఆకల్ని మంత్రించాము
మట్టిని మంత్రించాము
దోపిడి మమ్ము మంత్రించింది.
ఉదయానికి ఉదయానికి మధ్య
ఎన్నిరకాల వేటలో
చంపకుండా గాయపరచడం
చదువుల ఎత్తుగడ.
ఒకడు జైలు లోపల
ఒకడు జైలు వెలుపల
ఎవడి స్థానం ఎక్కడో చట్టం నిర్దేశించింది
మారిన స్థానం రాజ్యాంగాన్నే శాసించింది.
ప్రయాణాన్ని చూసి
పాదం భయపడనంత కాలం
ప్రయాణం భయపడుతుంది.
మట్టి ఎత్తుతూనే వున్నాం
మారని మీ చేతలు చూస్తూనే వున్నాం.

# కొడిగట్టిన కాలం

ఆదిత్యుని ఆయుర్దాయం ఒకే ఒక్క రోజు
దినం మారి రోజుకోమారు జన్మించినా
ఆదిత్యుని మనుగడ అక్షరాలా పన్నెండు గంటలు
వందేళ్ళ జీవితం ఒక్కరోజులో వెలిగించి
మరో పార్శ్యమండల సేవకై పయనం
అంతా లిప్తకాల గమనం.
మనిషి మార్పు వేరుగా వుంది
వీధి రచ్చబండపై ఊకదంపుడు కబుర్లు
పాలపండ్ల బాలభాస్కరుడు
పండు ముదుసలిగా మారినా
నడుం విరిగిన రచ్చబండ
నిరసన వెదజల్లినా
కాలం తెలియని మనుషుల మధ్య
కాలం కరిగిపోతూంది.
ఒక్క నిముషం ఒకే ఒక్క నిముషం
సొచివేత నిర్ణయానికి
ఓడిపోయిన యుద్ధాలెన్నో—

తెగిపోని ఆగిపోని నిరంతర
ధారావాహిక బాతాఖానీ
సిగరెట్లు కాలిపోతున్నాయి
తాగిన పానీయం ఉనికి గుర్తించడానికి
బొట్టు మిగలడం లేదు
ఎడతెగని తొక్కిడికి సోఫాలు
కీళ్ళు విరిగి ఆక్రోశించినా
కాలం తెలియని మనుషుల మధ్య
కాలం ఖర్చయిపోతూంది.
ఒక్క నిముషం ఒకే ఒక్క నిముషం
అనుకోని జాప్యానికి
ఆగిపోయిన గుండెలెన్నో—
కప్పుకున్న సోమరితనం
బద్ధకమై నిశ్శబ్దమై
మత్తుగా పడున్న మనుషులు
మంచం అసహ్యించినా
గది ఈసడించినా
మేల్కొనని నిద్రాళువులు.
ఒక్క క్షణం ఒకే ఒక్క క్షణం
అప్రమత్త చర్యకు
తప్పిపోయిన ప్రమాదాలెన్నో—
కాలం తెలియని మనుషుల మధ్య
కాలం కాలిపోతూంది.

# మట్టిని చదివితే

చూపు కేంద్రీకృతమై
పాదాల వద్ద ప్రదక్షిణ
చేతివేళ్ళు తినడానికి
తలగడగా మారడానికే కాదు
పెను నిద్ర లేపడానికి
పలు ప్రశ్నలు సంధించడానికీ.
కన్నభూమికి కన్నబిడ్డ
కలమో హలమో
ఖడ్గమో కాని నాడు
కన్నమట్టికి రూపంలేదు.
సముద్రాలు, పర్వతాలు
అరణ్యాలు, నదులు, హద్దులు కావు
ఏకత్వానికి భిన్నత్వాలు.
హద్దుల కోటగోడలు
ఇనుప తెరల అంతఃపురాలు చూసి
ఎల్లలు చెరిపిన దిక్కులు నవ్వుతాయి.
వినువీధిన ఇరుగ్గా నడుస్తూ

ఎదురొచ్చిన మేఘాలు ఆహ్వానిస్తే
ముడుచుకు కూర్చుంటాయి
మరుగుజ్జు ఆలోచనలు.
సముద్రం ఎదురై
క్షణంలో దాటిస్తానంటే
ఒడ్డుపై భీష్మిస్తుంది
ఒంటికాలి నడక.
చూపుకు పరిమితి లేదు
ఒక్క చూపుతో
సౌరకుటుంబం చిత్రీకరణ.
రక్తం అభిషిక్తమైన చోట
మట్టిని చదివితే
మనిషి చరిత్ర.
చదువుకు లిపి అక్కర్లేదు
లక్ష్యం లిపిని పుట్టిస్తుంది.

# స్వేద సముద్రం

ఉషోదయంలో ఆకసానికి ఎగిరి
పింజ మబ్బుల్ని వెండి ఆభరణం చేసి
పక్షుల మధ్య పక్షినౌతాను.
అరేబియన్ ఫెలికాన్ పక్షుల వలసకు
సుస్వాగతం పలికి
సైబీరియన్ కొంగలకు
హృదయపూర్వక వీడ్కోలు యిచ్చి
నేనో రంగునై ఆకాశానికి అద్దుతాను.
అనురాగం అనుబంధం పెనవేసి
ఒంటరితనం మటుమాయం
పోటీ వుండదు, ఓటమి వుండదు
ఎవరి పరుగులు వాళ్ళవి
ఎవరి శక్తి వాళ్ళది
పూట బత్తెం చేజిక్కాక
గూటికి చేరుతాను.

.........

ఈతగాళ్ళకు గజఈతగాణ్ణయి
సముద్రాన్ని లంఘిస్తాను

నీటిని ఆటవస్తువు చేసి
చేతులు ఆడుకుంటాయి.
అలుపెరగని చేపల మధ్య
అలసట అంతమౌతుంది
నా స్వేదం రుచి చూసిన సముద్రం
తన ఉప్పదనం ఒకపాలు తక్కువని
ఓటమినంగీకరిస్తుంది.
అడుగడుగును గాలించి
బత్తెం దొరికిన ఆనందంతో
భూమికి చేరుతాను.

.......

బత్యాన్ని భోజనంగా మార్చే ప్రక్రియలో
నీరు నిప్పుకై నేలపై పరుగెడతాను
ఆకల్ని ఆకలిగానే పెంచి
దారిద్ర్యాన్ని దారిద్ర్యంగానే వుంచి
బొక్కసం నింపుకోడం
ఎదిరించిన నేను
బలిచక్రవర్తి నౌతాను.

# గుప్పెడు ఆశ

నలుపు చేసిన కాగితాన్ని
నీ తెలుపెంతని అడిగితే
ఖరాబు చేసిన వాడి మనసంతని జవాబు
సముద్రాన్ని నీ లోతెంతని
సావధానమై ప్రశ్నిస్తే
నింగి తాకిన నీ గుండె నిలువంతని సమాధానం
విడిపడ్డ ప్రశ్నలు రెండింటికి
ముడిపడ్డ జవాబు ఒక్కటే ....
పరుగు తియ్యలేని వాడ్నిచూసి
పరుగెత్తే మేఘం బాధతో
హిమగిరికి తలబాదుకుని ఒళ్ళంతా నీరు
నడకలేని వాడ్నిచూసి ఉరకలేసే నది
ఏడ్చి ఏడ్చి విశాల సముద్రమైంది.
మనిషి కథ శవం చెపుతుంది
తవ్విన నేలలో ఎన్నెన్ని సెలలో .....
సీతాకోక చిలుకను
చేతివేళ్ళ జైళ్ళు బంధించాయి

కటకటాల్లేని పారదర్శక జైళ్ళు
మృదు స్పర్శ మృత్యుమాళిగలు.
కథ మారిపోయింది
కథలన్నీ సజీవం
కథలన్నీ సశేషం
సంపూర్ణానికి పూర్ణకుంభం స్వాగతిస్తే
సశేషం ఒక ఉప్పెన.
కాలికింద గరికపోచలూ
గాల్లో ఎండుటాకులూ
చీకట్లో చిదుగులు
ఉద్యమానికి మీరు ఉచ్ఛ్వాస నిశ్వాసలు.
విశ్వ విజేతా
ఏ చేత్తో భూమండలాన్ని ముక్కలు చేశావో
ఆ చేత్తో అతికించి ఆవిష్కరించవూ ......

# మౌన ఝంఝ

పొద్దెక్కినా పొడవని కళ్ళకు
నాది సుప్రభాత సేవ.
రోలు ద్వేషిస్తుంది
రోకలి కోపిస్తుంది
గింజలు దుఃఖిస్తాయి
నా వేళ్ళు ఏడుస్తాయి
అయినా దంచుతాయి.
ప్రశ్నకు నేను జవాబు
జవాబుకు నేను ప్రశ్న.
చిక్కంగట్టిన దూడ అరుస్తుంది
చేపిన గేదె శపిస్తుంది
నా చేతులు వణుకుతాయి
అయినా పితుకుతాయి.
మాసిన దుస్తుల రూపుకు
వెండి రంగు అద్దుతాను
కసువు కమ్మిన నేలకు
మిసిమి కాంతులు పూస్తాను

మనకేసిన అంట్లకు
మెరుపులు రుద్దుతాను
ఇంట్లో అందరూ అతిథులు
ఆతిథ్యానికి శాశ్వత ప్రతినిధులు.
నేను పడకటింట పాదచారిణి
వంటగది సహధర్మచారిణి
పసిబిడ్డ పాలఖజానా
మెట్టినింట దాస్యకాంత.
ఉద్యమంపై ఉద్యమం
ఉద్యమాల వెల్లువ చూశాం
ఏ ఉద్యమం ఎందుకు జరిగిందో
ఉద్యమం పాఠ్యగ్రంథమై చదివాం
పాతాళానికి అధఃపాతాళానికి
స్త్రీ జనోద్ధరణ పయనించడం చూశాం.
ఉద్యమం వేసిన ఒక్కోమెట్టు
వంటగదికే పయనం
మమ్ము అణిచేందుకు దూరదృష్టి
మీరు పెరిగేందుకు హ్రస్వదృష్టి.

# బతుకు కర్పూరం

కటిక వస్తుల కథకు
అన్నం దొరికిన కలలు అనుబంధాలు
చేతబట్టిన జానెడు కడుపుకు
జోలెడు విద్యలు చేయూత
తోటమాలితనం ఓ విద్య.
మొక్కలు కాళ్ళకు అడ్డం పడి
పసిబిడ్డల్లా ఉనికి చాటితే
జాలిపడ్డ గాలి చీడకొమ్మల్ని
విసురుగా వూపి దృష్టికి తెస్తుంది
తోటమాలిగా క్షేత్రానికి కన్నతండ్రిని
ఆహారం, ఆరోగ్యం, సంరక్షణ నా బాధ్యత.
నా నీడ నావెంట రాదు
నేనో చెట్టు వద్ద గొంతు కూర్చుంటే
మరో మొక్క ఉపచర్యలో నా నీడ
ఆశ ఆత్మవిశ్వాసాల్లో ఒంటరి కాను
చుట్టూ చెట్ల సమూహం వుంది
నాకు నేను జవాబుదారీ.

చెట్టు కడుపున పిందె పడ్డాక
వైద్యునిగా నా పాత్ర మార్పు
ఎన్ని సూచనలు ఎన్ని జాగ్రత్తలు
ఎన్ని సందేహాల నివృత్తులు.
పండుగా మారిన పిందెను
యజమానికి అందించాకే తృప్తి
హిమాలయాన్ని అధిష్ఠించిన సంతృప్తి.
యజమాని ముఖం విప్పారదు
తోటమాలికి ప్రశంసలుండవు
అదనపు విలువపై తీవ్ర అసంతృప్తి
అంతా యజమాని సేవకుల సంబంధం.
ఘట్టం ముగిసి మరో అంకం ప్రారంభం
మళ్ళీ చెట్టు కడుపున పిందె
యజమాని సేవకు పునరంకితం
మర్రిచెట్టు కింద మొక్క మొలవని సత్యం.
నా కడుపున బడ్డ బిడ్డపిందెల
సంరక్షణలో విఫలమౌతూ నేనూ
ఎండిన ఒయాసిస్సు నా భార్యా........

# మనిషి ముందుకు కథ వెనక్కు

అస్త్రులు వాచిన మరుగుజ్జు చేతులు
విధ్వంసాల వీరమల్లులు
నోబుల్ శాంతి బహుమతికై వేట.
చుట్టుముట్టిన అశాంతి రావణకాష్ఠం
క్షణక్షణం శాంతికోసం కలవరింపు
నియంత్రణ నోచుకోని
అణ్వాస్త్ర గోదాములు పిగిలి
పలుదేశాల ఆర్థికవ్యవస్థ విధ్వంసం.
అణుబాంబు తయారీదారుల
అక్రమ ఆక్రమణదారుల
కపట నాటక శాంతి ప్రదర్శనలు
అశాంతి సప్తసముద్రాల వైశాల్యం.
ఒక మైత్రి అలీనవిధాన ఉద్భవం
ఒక కలయిక ఐక్యరాజ్యసమితి ఆవిర్భావం
ఒక స్నేహం రాధేయుడి పట్టాభిషేకం.
స్నేహం ద్వంద్వార్థానికి జారి
వ్యంగ్యమై హేయమై

నిఘంటువు అర్థం మార్చుకుంది.
స్నేహానికి కరచాలనం ప్రతీకై
కలిసిన చేతుల ముఖాన పుట్టెడు నవ్వులు
ఎదలో ఏడు నిలువుల విషజలాలు.
ఊగుతూ వూగుతూ
ముడివడి విడివడని కరచాలనం ముందు
వెలరేగిన సరిహద్దు ఘర్షణలు
స్నేహానికి పెను అపహాస్యం
అమైత్రి అనంత వ్యాప్తం
అహింస మహాత్ముడంత ఎత్తు
అడుగులు ఆమడలు కొలతకు చాలవు
యుద్ధం చేసిన అభినవ అశోకులు
ఖడ్గాలు దాచిన నటన
బోధివృక్షచ్ఛాయ నుండి లేచిన
ప్రబుద్ధులు ప్రవచనాల వల్లింపు
అహింస మాటున పుట్టిన హింస
సమస్త నదుల ప్రవాహం.
క్షుద్ర జీవి అసురునిపై
మానవుని యుద్ధమేది?

# నీతికి ఉప్పు పాతర

శాస్త్రీయ ప్రణాళికాబద్ధంగా
నేలపై నీతి తరమబడింది
అస్పృశ్యమై అదృశ్యమైంది.
ఎప్పుడో ఎక్కడో కాలంగాని కాలంలో
నీతి తలెత్తితే
తలా కొంచెం దానం చేసిన పిడికెడు ఉప్పుతో
నిండుగా నీతికి ఉప్పు పాతర.
నీతి మాట్లాడ్డం, చర్చించడం, బోధించడం
స్వాభిమానానికి చిన్నతనం
అంతస్తుకు అధఃపతనం
పగలు నిండు హరితం
రాత్రి పండు వెన్నెలై
అవినీతి వెల్లివిరుస్తూంది.
ఆవిరై ఆకాశపు అమ్మగారింట
మేఘాల్ని కంటూంది
నదులు, కాలువలు, సరస్సులు, సముద్రాలై
నేల పునీతమౌతుంది

అవినీతి అధిష్ఠించిన వాడికి
అఖండ జయజయధ్వానాలు.
క్షిపణి వెళ్ళినంత వేగంగా
క్షణంలో కోట్ల సంపాదన
సుఖాల లోగిలి.
రాజ్యాంగాన్ని ఆసాంతం బట్టీపట్టండి
చట్టాన్ని ఆమూలాగ్రం ఒప్పజెప్పండి
శిక్షపడ్డ నాయకుల్ని వేళ్ళపై లెక్కించండి
చేతి పదివేళ్ళూ శేషాలే.
అవినీతికి జేజేలు
నీతికి మంగళారతులు.

......

అణిచినా అణగని నీతి తరచూ
ఉప్పు పాతర్లోంచి సజీవమై లేస్తూంది
ఇంటింటా పిడికెడు ఉప్పు పంచి ఉద్యమిస్తూంది
ఎంతైనా నీతి ఇంట్లో పూర్వపక్షాన
ఉప్పు తిన్న మనుషులం కదూ .......
కృతజ్ఞతతో కృతఘ్నతను గుర్తు చేసి
నిలువెత్తు ప్రశ్నను నాటుతూంది.

# అద్దంలో బొమ్మ

గోధూళి వేళ ....
ఎర్రమట్టి పులుముకున్న
చెట్లముఖాల మురికిరూపులు
ఉగ్గబట్టిన కడుపుతీపి వుప్పొంగి
పచ్చికబీళ్ళ నుండి పశువులు ఇంటికి పరుగు
అష్టకష్టాలూ అదనంగా
మరో కష్టం అనుభవించినా
కాపరికి అదుపుగాని ఆలమంద
చెంగుచెంగున గంతులేసి స్వాగతించి
తల్లి పొదుగులో తలదూర్చి
ఎండిన డొక్కలు ఎగరేస్తూ దూడబిడ్డ.
పడి చచ్చిన పందికొక్కును
మూతి చేత్తో పక్కకు నెట్టి
కుడితి తాగుతూ తల్లి ఆవు.
చెట్టు నీడన విశ్రమించిన
బహుదూరపు బాటసారి
విప్పిన కూటి మూటలో

చూపుడువేలు చచ్చిన ఈగను చూసి
బొటనవేల్తో బాణమై సంధింపు.
విగతజీవి ఎగిరి ఎటుపడిందో
కడుపుమంటకు యివేమీ కావు అనర్థం.
హిమశీతల భోజనగదిలో
అరవయ్యారు ఆహారపదార్థాల మధ్య
ఒకడి ఆర్భాటం దశదిశల వ్యాప్తి
వడ్డించిన విస్తట్లో ఒకే ఒక ఎర్రచీమ
భోక్త సూక్ష్మవీక్షణానికి పట్టుబడి
విస్తరి చెత్తకుండీకి తరలింపు....
బాల్య యౌవన వృద్ధాప్యాల ఉనికి
చూసింది చూసినట్టుగా చూపిన అద్దం
భళ్ళున బ్రద్దలైన కారణం
కలత చెందిన నడక
కనురెప్పల కన్నీటి మునక.

# ప్రాణప్రతిమ

కొనుగోలు అమ్మకపు జాబితాల్లో
జంతువుల వస్తువుల్తో బాటు
స్త్రీ జాతి సరుకై చేర్చబడింది
అత్తగారిళ్ళకు
వ్యభిచార గృహాలకు
స్వేచ్ఛా క్రయవిక్రయ వాణిజ్యం.
బోన్లూ గూళ్ళూ
జంతువులు పక్షుల్తోపాటు
స్త్రీలకూ కేటాయింపులు
స్త్రీ రెక్కలేని పక్షి.
అమ్మా నాన్నలు
ఇంటింటా న్యాయమూర్తి ద్వయం
అన్నా చెల్లికి ఒకే నీతి వర్తించదు
కొడుకు స్వర్గలోక ప్రదాత
కూతురు త్రిశంకు స్వర్గ ప్రదీప్తి
ఒక చేతిని నరుక్కుని
ఒంటిచేతి వికృతానందం

ఒక కంటిని పెకలించి
ఒంటికంటి మహదానందం.
కదలి వెళ్ళే కూతురుకో న్యాయం
ముడుపుల మూపు భారంతో
మంచమెక్కుతుంది పుట్టిల్లు
తరలి వచ్చే కోడలికో న్యాయం
కట్నం కానుకల కాంక్షతో
మంకుపట్టు మెట్టినిల్లు మంచం దిగదు.
ఇంట్లో న్యాయాన్ని పాతిపెట్టి
ఇంటి న్యాయమూర్తులిద్దరూ
ఇల్లెక్కి ఆర్తనాదాలు
వేడికోలుకు ద్రవించి
ఎగిరే పక్షి దోసిట్లో వాలదు
దూకుడుగా దూసుకొచ్చే అల
అరికాలి అడ్డుకు ఆగదు.
అవమానంలోంచి
అణిచివేతలోంచి
అసమానతలోంచి
అపరకాళికలు జన్మిస్తారు
వాళ్ళిప్పుడు
నెలలు నిండిన బిడ్డలు.

# కన్నీటిని కత్తి చీల్చితే

మనిషి వాయిస్తున్న మతం పియానోల మధ్య
వాలేపక్షికి మందిరాల మతలబులు తెలియవు
దారుల్లో పారే రక్తం నీళ్ళనుకుని
నడిచిపోయే నాగరికుల మధ్య
జ్ఞప్తికి జలాశయాలు నిర్మించాల్సి వుంది.
ఇది విషాదాల అంగడి
ఇది వెతల వారసత్వం
ఇది కన్నీటి తీగల చెట్టు
తాత నుండి తండ్రికి ఆపై కొడుక్కి
వెట్టిచాకిరి చక్రవడ్డీ
బరువైనప్పుడు కూలిపోతూ
కోలుకోలేక చితికిపోతూ
అద్రుపుండు జీవితం—
శిలాఫలకం చెక్కకుండానే భూస్థాపితం
ముందు తరానికి శ్వేతపత్రం.
కాంతికి కాపలా కాసి కాసి
పగటికి నిద్రలేదు

చీకటికి ఊడిగం చేసి చేసి
రాత్రికి కునుకు లేదు
సామంతరాజుల ప్రచ్ఛన్న యుద్ధం
రారాజుల కేళీవిలాసం.
నోరాడితే పంటి కింద పన్ను తగిలే బతుకులు
కన్నీటి గోధుమల్ని పండిస్తాయి
కన్నీరు వరదగుడైన చోట
గాయపడ్డ చూపు గేయమౌతుంది.
అనంతమై విర్రవీగిన ఆకాశం
పక్షి చేతిలో ఓడిపోతుంది.
రాలిపడే చినుకుల్ని ఆకాశం అడ్డుకోలేదు
ఎగిసిపడే జలధారను భూమి బంధించలేదు.
కన్నీటిని కత్తి చీల్చితే
కారి పారేది రక్తమే
స్వేదం చేసిన సంతకం
రక్తం కంటే సాంద్రం.

# హరివిల్లు రెక్కలపై

ఓ విత్తనం ఉగ్గినెన్నెడు నీళ్ళ మైత్రి
మనకిచ్చిన మహత్తర బహుకృతి ఓ మహావృక్షం
ఆకులిచ్చిన అభయంతో
కట్టని ఇల్లయిన చెట్టుకింద
గూడులేని మానవుడి నివాసం.
చెట్టు ఎన్ని కోకిళ్ళ రాగాలు
ఎన్ని పక్షుల కలకలలు
ఎన్ని గాలుల కలయికలు
ఎన్ని గూళ్ళ కట్టడాలు
ఎన్ని పండుటాకుల వర్ధంతులు
ఎన్ని పిందెల బాలింతలు.
పట్టు సరిగెల కలనేత
ఒకానొక సీతాకోకచిలక
హరివిల్లు రెక్కలపై రాసుకుని
నక్షత్రాల్ని అద్దుకుని
ఆకు ఆకున వాలి వాలకుండా
చెట్టు శిరస్సున కోహినూరు వజ్రం.

ఆకు పరదాలు కట్టుకుని
కొమ్మల్లో కూర్చున్న మధుకలశాలకు
తేనెటీగలు రక్షణకవచం.
ఒళ్ళంతా పువ్వొళ్ళు పూసి
సరాగాల భృంగాలకు
పరాగాల విందు చేస్తూ
చెట్టంతా ఆనందాల సందడి.
చెట్టుకొమ్మ తొలకరి నాగలై
కొండ్రవేస్తే
విశ్వం ఆకుపచ్చ తివాసీ.
తలవంచిన మనిషికి
చెట్టు తలెత్తడం నేర్పిన జయపతాక
ఊర్ధ్వ ముఖంగా విశ్రమించిన మనిషికి
నుదుటిపై మొలిచిన బోధివృక్షం.

# ఇంకా తెల్లారలేదు

సంక్షుభిత జనారణ్యాన
నిశ్శబ్దమై నిలుస్తాను
భువనఘోష చుట్టుముట్టుతుంది.
నడుం విరిగిన చెప్పుల్ని విశ్రాంతికి వొదిలి
పాదాల్ని ప్రయాణానికి సిద్ధం చేస్తాడు చిన్నకొడుకు
పారదర్శక ప్లాస్టిక్ పేపర్లో బంధించిన డిగ్రీకి
హస్తరేఖ అంటనివ్వని జాగ్రత్త అతనిది
ఆశ సప్తవర్ణమై ఆకాశానికి లాక్కెళ్ళి
నిరాశ సప్తపాతాళాల్లో పడేస్తుంది.
ఏ ఇంటర్వ్యూ ఫలించదు
ఎక్కే మెట్లపై ఉత్సాహం
దిగే మెట్లపై ఆవేశం
అవ్యక్త మహావిస్ఫోటనం....
ఒక యంత్రాంగం అవిశ్రాంతమై వెంటబడి
వాడి ముద్ర ఎక్కడా అంటనివ్వదు
అస్తిత్వం కోసం ఏ ప్రయత్నమూ ఫలించదు
ఓటమి ఆలోచనల్లో పడేసి

స్వాభిమానం ఇంటికి రానివ్వదు.
వాకిట్లో కొడుకు రాకకు వేచి చూస్తూ
వండిన వంట చల్లారకుండా
గుండెల్లో దాస్తుంది అమ్మ.....
పట్టుదొరకని ఇసుకలో పాదాలు దూర్చి
సాగరతీరాన నిశ్శబ్దమై నిలుస్తాను
సముద్రఘోష వెంబడిస్తుంది.
అలల్ని పడవతో కోసుకుంటూ పెద్దకొడుకు
సుదూర ప్రయాణపు మజిలీలో
వల విసిరి వేట ప్రారంభం
ఎత్తును పసిగట్టిన చేపలు
రక్షిత స్థలాలకు ఈది పైయ్యెత్తు వేస్తాయి.
ప్రభాకరుడు పడమరకెళ్ళి
అంబుధిని తొంగిచూస్తాడు
గాయపడి ఎగిరిపడ్డ నీళ్ళు నెమ్మదించి
పడవను పసిబిడ్డ ఉయ్యాల్లా వూపుతాయి
పట్టుమని పది చేపలు పట్టుబడక
పెద్దకొడుకు ఒడ్డున పునరుత్థానం.....
వేటగాడ్ని వెంటాడిన దళారి
పదిరూకల పెట్టుబడితో శ్రమశక్తి దోపిడి.
పప్పుకు ఉప్పుకు పైసల్లేక
ఇల్లాలి నీళ్ళొండిన కళ్ళ నిరీక్షణ—
ప్రళయఘోష విలయతాండవం మోస్తూ
భూమి గానుగెద్దయి సూర్యుడి చుట్టూ ప్రదక్షిణ
సూర్యుడు రాల్చిన వెలుగు నూనెను
అక్రమ నిల్వలు చేస్తూ అవినీతిదార్లు—

# అనాదిగా అదే నీతి

భారంగా దిగింది బాలింత తల్లికోడి
పొదుగు బుట్టను వదిలి పసిపాపల్తో
నలుపు తెలుపు గోధుమ వర్ణం కొన్ని
అమ్మ రంగుకు అచ్చం ప్రతిరూపం కొన్ని.
బుడి బుడి నడకల్తో
అమ్మ మెడ మీద మావటై స్వారీ చేస్తూ కొన్ని
రెక్కల దుప్పట్లో చలి కాచుకుంటూ కొన్ని.
అమ్మ ఆదేశం మార్గదర్శనం మధ్య
పసిబిడ్డల ఏవో మాటలు ఏవేవో పాటలు
చిరు చిరు నడకలు చిన్నారి చూపులు
పిల్లలు కొమ్మారెమ్మల్లేని పుడమి పూసిన పువ్వులు.
వీధి బతుకులు పేద బతుకులు
పరిశ్రమిస్తేనే కడుపుకు నాలుగు నూకలు.
గోళ్ళతో నేలను చీలుస్తూ
ముక్కుతో పొడుస్తూ
తల్లికోడి ఆహారం సేకరిస్తూంది
అమ్మను అనుకరిస్తూ పెరట్లో బిడ్డలు

పొలుగారే ముక్కును నేల వెక్కిరిస్తుంటే
ప్రథమాధ్యాయంలో అభ్యాసం సాగుతూంది.
హఠాత్తుగా ముక్కుగన్ను పైకెక్కు పెట్టి
తల్లికోడి పెడబొబ్బలు పెడుతూంది
కాలివేళ్ళు పిడికిళ్ళు బిగించి
రెక్కలు భూమ్యాకర్షణ చీల్చి
పై పైకి ఎగిసిపడుతున్నాయి
లోకం తెలియని కూనలు
చూపు రిక్కరించి పైకి చూస్తున్నాయి
గగనాన మాటేసిన గద్ద
గిరికీలు తిరిగి పల్టీలు కొడుతూంది.
పైన తిరిగేదేమిటో పసికూనలకు తెలియదు
అమ్మ ఉగ్రత ఎందుకో తెలియదు
ప్రాణమంటే తెలియదు
ప్రాణం పోవడమంటే తెలియదు.
అధోముఖం పట్టిన అంతరిక్షవాహనంలా గద్ద
నేల తాకి రివ్వున పైకిలేచింది
కాలిగోళ్ళ మధ్య నలిగి బిడ్డ ప్రాణం
అనంత వాయువుల్లో కలిసిపోయింది
మమతానుబంధం తెగిన క్షణమది
అమ్మ దుఃఖానికి అంతులేదు
బిడ్డల ఆక్రందనకు ఎల్లల్లేవు.
నోరున్న బలవంతుడిది ఒకనీతి
నోర్లేని బలవంతుడిదీ అదేరీతి
అనాదిగా బలహీనత మూల్యం చెల్లింపు
యుగయుగాలుగా ఇదే ముగింపు.

# కూలుతున్న గోడలు

స్వేచ్ఛ రాజ్యాంగం ఇచ్చిన
సంపూర్ణ హక్కే ఐనా
ఒకడు వెంబడించి నియంత్రిస్తాడు
ఒకడు నిశ్చలమై యాంత్రీకరిస్తాడు
ఒకడు మాటున దాగి ఆడిస్తాడు
ఎక్కడో నరాలు తెగిపోతూ
నిట్టనిలువునా కూలిపోతూ
జడత్వం తొడుక్కుంటూ నువ్వు.....
హద్దులు చెరుపుకుంటూ
చలిచీమల చేత చిక్కని సర్పాలు
సరిహద్దుల్ని విస్తరిస్తుంటాయి
నిన్నాక్రమించిన వాడికి రెండు కళ్ళూ
రెండు చేతులూ, రెండు కాళ్ళే ఐనా
ఎదుర్కోడానికి రెండు కళ్ళూ
రెండు చేతులూ, రెండు కాళ్ళూ చాలవు.
సముద్రం పాతది దారులు కొత్తవి
నేల పాతది ఆలోచనలు కొత్తవి

ఆకాశం పాతది వెలుగులు కొత్తవి
మనిషి మందగిస్తేనో
బద్దకంగా విశ్రమిస్తేనో
కాలం కంచు ఢక్కా అవుతుంది.
కొత్త అద్దంలో వృద్ధాప్యం
యౌవనంగా ప్రతిఫలించదు
సత్సందేశం ఇక్కడే ప్రారంభం
ఎవరి మొద్దుబారిన మెదళ్ళు
వారి దగ్గరే సురక్షితం
దొంగిలించబడవు, అమ్ముడు కావు.
శక్తి పై నిఘావేసి
చుట్టూ శత్రువు పహరా
స్తబ్ధత చలనమై
సంఘటించటం ఉద్యమం
అందిన ఆకురాయితో
పదును పెట్టడం ఉద్యమం.
నరలోకపు అడ్డుగోడలు
కూలుతున్న దృశ్యం
గొలుసుబలం లింకులపై ఆధారం.

# భూగోళం ఆమె శిశువు

ఒక సామ్రాజ్యం గెలుస్తుంది
వీరమాతకు విజయం
ఒక సామ్రాజ్యం ఓడుతుంది
మాతృమూర్తికి పరాజయం.
నారు పోసి నీరు పోసేది అమ్మ
నారు నాటి కోత కోసేది అమ్మ
పంటకాల్వ నీటిఅద్దంలో కదలాడే రూపు అమ్మ
అక్షరం నేర్చి పెదాలు "అమ్మ"ను చదివినపుడు
యక్షకన్యై ఆకసానికి ఎగిసేది అమ్మ
పుల్లల్లేని పొయ్యిలో
అమ్మ వేళ్ళెట్టి ఉడకెయ్యడం చూస్తాం
వండిన వంటలో
తనకో ముద్ద మిగుల్చుకోనితనం చూస్తాం
నిలకడ నీటిలో రూపాన్ని చూసి
నీటితైలంతో తల దువ్వుకోవడం చూస్తాం
రాజూ పేద. భేదాల వేదభూమిలో
బతుకెప్పుడూ పెరగని పొట్టిది.

ఆకులో గాలిలో అమ్మ
నీటిలో మట్టిలో అమ్మ
నిన్ను చూసిన వాళ్ళకు అమ్మే నువ్వు
నువ్వు అద్దంలో చూస్తే నువ్వే అమ్మ.
నిండుకున్న దొంతి కుండల్లో అమ్మ వేళ్ళు వెతుకుతుంటే
అర్థమైన పిల్లి నిర్భయంగా పొయ్యిలో నిదురిస్తుంది
శోధించినా తిండిగింజల్ని సాధించలేమని తెలిసినా
ఆశ చావని వేళ్ళు కుండల్లో తిరిగి అరుగుతుంటాయి.
పగలు గ్రీష్మానికి ఒళ్ళు పెనం చేసిన అమ్మ
రాత్రి కడుపున పేగులు కాల్తాయి.
ఆనందానికి ఆవేదనకూ అమ్మ వుంది
ఆవేశానికి ఆక్రోశానికీ అమ్మ వుంది
అమ్మకు అందరూ శిశువులు—
అమ్మ చేయి గోరుముద్దయి నోటికి చేరితే
అలిగి బిగిసిన నోరు అలవోకగా విప్పారుతుంది
బావిని బానలో నింపి భుజంపై ఇంటికి మోస్తుంటే
భగీరథుడి బహిరంగ పరాజయం—
ప్రతి అమ్మకో స్వార్థం వుంది
కన్నబిడ్డ ఎదగాలని
ప్రతి అమ్మకో త్యాగం వుంది
కన్నబిడ్డకై కరగాలని—

# రూపుకు రెండు ముఖాలు

1

శుక్ల కృష్ణ పక్షాల చుట్టూ
జీవన భ్రమణం
భీకర బీభత్స భూకంపమై
భీషణ భయానక అగ్నిపర్వతమై
పచ్చని బతుకును మసి చేసిన భూమి.
ఫెళఫెళారవంతో ఒక్కసారి
నింగి సముద్రమై నేలకూలి
చరాచరాల్ని ఎండుటాకుల్లా ఎగరేసి
సముద్ర నిమజ్జనం చేసిన నింగి.
అమానవీకరణ యాంత్రిక జీవితం
కలుషిత విష వాతావరణం
మత వైషమ్యాలు మాఫియా గ్యాంగుల మధ్య
ఏకాకితనం కప్పిన నగరం.
మోతుబరి దౌర్జన్యం కులరక్కసి
ఫ్యాక్షన్ కక్షల్తో యుద్ధశిబిరాలై
పంట కాలువలో శవాలు పారుతున్న గ్రామం.

ఇప్పుడు రంగు వెలిసిన నమ్మకానికి
మనసు పిండి అద్దాల్సి వుంది.

2

విత్తును మహావృక్షం చేసి
హరిత పత్రపు పాత్రెళ్ళలో
పండిన పంట గోరుముద్దల్జేసి
ఆత్మీయతారాగంతో
అన్నప్రాశన వేసిన భూమి.
మానవ కళ్యాణానికి
మేఘాలు సుశిక్షిత సైనికులై
అక్కరమేరకే వర్షించి
పసిడిని పండించిన నింగి.
ఉన్నత విద్య, ఆధునిక వైద్యం
విస్తరించిన పారిశ్రామికీకరణ
శాస్త్ర సాంకేతికం నిండిన నగరం.
పాడి సంపద, పండు వెన్నెల
పిల్ల తెమ్మెర, రంగవల్లి
హరిత విప్లవ సింధువైన గ్రామం.
చెదిరిన రూపుకు శిల్పించిన ఆకృతి
ప్రేమను వమ్ముజేసే కృత్యాలపై
మనిషి అజేయుడని నమ్మి
విశ్వప్రేమిగా విస్తరించాల్సివుంది.

# కాస్త అలసట తీరాక

నిద్రిస్తున్న ఆమెను మేల్కొల్పవద్దు
చెదిరిన చీర, జారిన పైట ఆమెకు పట్టదు
నిద్ర సిగ్గెరగదు, వయసెరగదు
మనిషి నిద్రకు అమ్ముడయ్యాక
క్రయం విక్రయం పై ఆధిపత్యం
నేలను పసిడి తల్పం చేసి
ముంజేయి మెత్తని తలదిండై ఆమె పడక.
చెట్టును ఓడించిన సూర్యకాంతి
ఆమె ఒంటిపై కాంతి మచ్చలు
కాంతిని ఓడించిన చెట్టు
ఆమె మేను పై నీడ మరకలు
నిద్రకు నిర్ణీత కాలమూ
నియమిత స్థలమూ వుండవు
నిద్ర శ్రమ జోల
నిద్ర అలసట ఊయల.
రాళ్ళెత్తిన కూలీ ఆమె
రాళ్ళల్లో రప్ప ఆమె
భీకరారణ్యాన కాలిబాట ఆమె

పడిపోయిన తరంగానికి ఆశ ఆమె
పైకి లేస్తున్న అలకు ఊపిరి ఆమె
లోయలు దాటి లోకాలు దాటి
ఎక్కడో నిశ్శబ్దంగా శబ్దించుకుంటూ నిద్రిస్తూంది.
ఆమె చేతులు కొండల్ని ఒణికిస్తాయి
రాళ్ళు పిండిగా మారుతాయి
ఆమె పాదాలు భూమిని కంపిస్తాయి
లోయలు రోడ్లుగా రూపం చెందుతాయి
మట్టిలో పవ్వళించి మట్టిని కప్పుకున్న
మట్టిమనిషి ఆమె.
రోడ్డు పూర్తైనట్టు, స్వాగతాలు పలుకుతున్నట్టు
నడకల విగ్రవీగుడు వినమ్రంగా స్వీకరిస్తున్నట్టు
ఆమెను స్వప్నంలోకి జారనివ్వండి
అలసట తీరాక శ్రమదానం మీ కోసమే
వాయినాలు అందుకుందురు వరుసగా నిలబడి.
ధ్వని వాతావరణ కాలుష్యాలకు
ఆమె చెక్కు చెదరదు పక్క దొర్లదు
ఆకలి నవనాడులు కేంద్రీకృతమైన చోట
సున్నితంగా రిమోట్ స్పృశిస్తే చాలు
మీ అధికార దర్పధ్వని "ఒసే ఓబులమ్మో"
ఆమెకు వేయి సైరన్ల మేలుకొలుపు.
ఆమె ఘనీభవించిన ఘర్మజలం
ఆమె పసిడి ముడి లోహం
నిద్రిస్తున్న ఆమెను మేల్కొల్పవద్దు
అలసట తీరాక శ్రమదానం మీ కోసమే
వాయినాలు ..... అందుకుందురు వరుసగా నిలబడి.

# నిర్మాణం జరుగుతూవుంది

మీపై మాకు అనుమానాల్లేవు అన్నీ నమ్మకాలే
వామనుడి మూడోపాదం మాకు కేటాయించడం
నమ్మకాల్లో ఒక నమ్మకం.
ఒక బుగ్గ మాడితే ఒక బుగ్గ గులాబి
పుట్టిన ప్రతివాడు బ్రతకడం హక్కు
బ్రతకనివ్వడం ప్రతిపౌరుడి బాధ్యత.
హీనులుగా మమ్ము జమకడితే
ఏ తల్లి ఇరవైమాసాలు మోసి కన్నదో
లెక్క చెప్పాల్సి వుంది
మా నుదుటి పై బ్రహ్మరాత చూపితే
మీ నుదుటిపై రాసిన బ్రహ్మను చూపాల్సి వుంది.
వెయ్యికోట్లు ఒక్కడే నెమరేస్తే
తిరగబడ్డ ఒక్కడే కోటిమంది ప్రతినిధి
గోడపక్కనో రాళ్ళకిందనో పారాడే చీమలబారు
వాసన పసిగట్టి
చుట్టుముట్టడం వాస్తవిక చిత్రం.
గోవులు ముప్పును పసిగడితే

కొమ్ములు తుపాకి బాయ్‌నెట్లను తలదన్నుతాయి.
ఒకడు ఏతం వేస్తే ఒకడికి వెయ్యిపుట్లు
మేఘం తన బిడ్డని సముద్రం విర్రవీగితే
నదులు, చెరువులు, వాగులు, వంకలు వ్యాజ్యమాడుతాయి.
మట్టి వెలిగించిన కరెంటు బల్బులు
మట్టిని వెలిగించడం లేదు
తలొంచి నడవడం భయానికి సంకేతం కాదు
వెల్లావెదురైన బలాన్ని ఏరుతూ కూడగట్టడం .....
నులిమిన గొంతుల్లోంచి పొగడ్తలు రావు
పొంగిన లావా తప్ప
నీరు ఎండిపోయిందని నది నిద్రపోదు
రాబోయే నీటిబిడ్డ కోసం
కరకట్టలు ఉయ్యాళ్ళై ఎదురుచూస్తాయి
ఆశయం కొండవీటి చేంతాడు.....
ధరించిన శిరస్త్రాణం చెదరకనే
శిరస్సు తెగిపడుతుంది
అష్టదిక్పాలకులు అంగరక్షకులై నిల్చినా
గుండెను బాణం నిలువునా గుచ్చుతుంది.

పరమోపాయం" అంటూ అందుకున్నాడు కృష్ణుడు, "నేనూ, అన్నయ్యా మధుర వొదిలి వెళిపోతాం. మామీద పగ కాని మధురమీద పగకాదు జరాసంధుడికి. అంచేత మేం లేమంటే మధురమీదికి రాడు. వచ్చినా మేం లేకపోడం చూసి, మాకోసం గాలించి మా వెంట పడతాడు. మా పలాయనం పరాజయంకాదు, పరమోపాయం. అదును చూసి జరాసంధుడ్ని హరీ అనిపిస్తాను."

## పలాయనం

రహస్యంగా మారువేషాలు వేసుకుని మధురనించి పారిపోయారు రామకృష్ణులు. ఆ పోవడం పోవడం దక్షిణ దేశానికి నడిచారు. వేణీనది దగ్గిర కరవీరపురం చేరారు. అక్కడ అడివిలో పరశురాముణ్ణి చూశారు. అతడు చెప్పిన ప్రకారం వేణీనది దాటారు. అక్కడ యజ్ఞగిరిమీద ఒక రాత్రి వున్నారు. అవతల ఖట్వాంగనది దాటి క్రౌంచపురం చేరారు. అనంతరం గోమంతపర్వతం మీదికి వెళ్ళారు. రకరకాల చెట్లతోనూ, మృగాలతోనూ, పిట్టలతోనూ, సెలయేళ్ళతోనూ ఎంతో గొప్పగా వుంది గోమంతం. విరబూసిన పువ్వులు గమ్మున్మంటున్నాయి. ఆరముగ్గిన పళ్లు నోరూరిస్తున్నాయి. కమ్మని పిల్లగాలులు హాయి కల్పిస్తున్నాయి.

గోమంతం శిఖరాలు ఆకాశం అంటుతున్నట్టుంటాయి. దీనికి ప్రస్రవణం అనికూడ పేరు. హెచ్చువర్షాలు కురిసే కొండ కనక దానికా పేరు వచ్చింది.

రామకృష్ణులు వచ్చి గోమంతంమీద తిరుగుతూ వుండగా ఒక కదంబం చెట్టు తొర్రలోంచి కారుతూ కల్లు కనబడింది బలరాముడికి. కదంబం చెట్టునించి కారడంచేత దాని పేరు కాదంబరి. వాసన మత్తుగా వుంది.

కాదంబరిమద్యం కడుపారా తాగాడు బలరాముడు. కైపెక్కి కళ్లు తిప్పాడు.

ఆ కైపులో అతడికి కాదంబరి అందమైన ఆడదిగా వరించింది. తనపేరు వారుణి అంది. అలాగే మరిద్దరు అందకత్తెలూ అతణ్ణి వరించారు. అందులో ఒకామె పేరు కాంతి.

ఇంతలో గరుడు వచ్చి కృష్ణుడికి కిరీటం ఇచ్చి వెళ్ళాడు.

## కొండకి నిప్పు

రామకృష్ణులు మధురనించి దక్షిణాదికి పారిపోయారని తెలుసుకున్నాడు జరాసంధుడు. మధుర ముట్టడికి వెళుతున్న సైన్యాలు దక్షిణాదికి మళ్ళించాడు. కొండలూ, అడవులూ గాలించి, తుదకి ప్రస్రవణ పర్వతంమీద రామకృష్ణులున్నట్టు కనిపెట్టాడు. రాజులతోనూ, రాణువతోనూ, ప్రస్రవణం ముట్టడించాడు. "కొండ కొండంతా నేలమట్టం చేయండి" అంటూ హుకుం వేశాడు.

గుదియలూ, గునపాలూ, గడ్డపారలూ, గండ్రగొడ్డళ్ళూ పట్టుకుని సైనికులు కొండమీద పడ్డారు, మిడతలదండులాగ. రాళ్లు తవ్వారు. పణుకులు పెల్లగించారు. మాళ్లు నరికారు. సెలయేళ్లు కప్పారు.

సాధ్యపడలేదు కొండ. చదరమయినా నదును కాలేదు కొండ. మీదికెగబడ్డారు రాజులు. ముళ్ళలో రాళ్ళలో ముందుకి సాగలేకపోయారు. చిటారు సిఖరం మీదున్నారు రామకృష్ణులు. తెలుపు నలుపు మేఘాల్లా అవుపిస్తున్నారు. యుద్ధానికి సిద్ధంగానే వున్నారు వారు.

"మహారాజా!" అదంతా చూసి జరాసంధుడితో అన్నాడు శిశుపాలుడు. "ఈ కొండ ఎక్కడమే మనకి చేత కాకండా వుంది. ఎక్కితేకదా, వాళ్ళతో యుద్ధం. ఇంతకీ నేల మీద ఎంత యుద్ధమైనా చేస్తాం. పదివేల బలరామ కృష్ణుల్ని పాతిపెట్టేస్తాం. కాని కొండ యుద్ధం తెలిసినవాడు మన దండులో ఒక్కడూ లేడు. ఈ రామకృష్ణులా సామా న్యులుకారు. దీంతో పద్దెనిమిది సార్లు మనల్ని మూడు చెరు వుల నీళ్ళు తాగిస్తున్నారు. కనక నేనో మంచి ఉపాయం చెపుతాను. దీంతో వీళ్ళ శని విరగడైపోతుంది.

ఈ కొండచుట్టూ కర్రా, కంపా, గడ్డీ, గాదా, కప్పేట్టు నిప్పు పెట్టేద్దాం. చెట్టు చేమలతో మండిపోతుంది కొండ. రామకృష్ణులు కాలిపోతారు. చచ్చి వూరుకుంటారు."

బాగుందంటే బాగుందన్నారు కడపరాజులు.

"అయితే అగ్గి పెట్టండి" అని అరిచాడు జరాసంధుడు. సింహనాదాలు చేశారు సైనికులు. ఎండు కట్టెలూ, ఎండు గడ్డీ కప్పి, కొండకి నిప్పుముట్టించారు.

చుట్టూ పొగలతో మంటలు కక్కింది కొండ. పెద్ద పెద్ద చెట్లు భగభగా మండిపోయాయి. రాళ్ళు పగిలి

పోయాయి. మృగాలూ, పక్షులూ పారిపోయాయి. పెద్దపెద్ద పాములు తగలబడిపోయాయి. పొగలు ఆకాశం ఆవరించాయి. చుట్టుపట్ల అడవులూ, కొండలూ పొగలో అవుపడకండా పోయాయి. జరాసంధుడి దండు అరకోసు వెనక్కి పోయింది. వేడి తట్టుకోలేకపోయింది.

ఈ గందికలో కొండశిఖరం దూకేసి తప్పుకుపోయారు రామకృష్ణులు.

అన్నదమ్ములిద్దరూ అగ్గిలో బుగ్గయిపోయారనుకున్నాడు జరాసంధుడు. నిశ్చింతగా మగధ మళ్ళిపోయాడు. రాజులందరు తమ తమ సేనలు తర్లించుకుపోయారు.

కాని, బలరామకృష్ణుల మేనత్త మగడూ, శిశుపాలుడి తండ్రీ, ఛేదిదేశం రాజూ అయిన దమఘోషుడు ఎలాగో రామకృష్ణుల్ని కలుసుకున్నాడు. తన చుట్టరికం చెప్పి వారితో నమ్మకంగా మాట్లాడాడు.

"మీరంటే ఇష్టం నాకు. జరాసంధుడు లాక్కు వచ్చినా, మీతో యుద్ధం వద్దని చెవిలో గూడుకట్టుకుని చెప్పాను. కాని వినుకోలేదు మూర్ఖుడు. ఇప్పటికి వెళ్ళిపోయినా, పగ ఒదలడు. తెలిసిందంటే మళ్ళీ విరుచుకుపడతాడు. ఇక్కడ వుండకూడదు మీరు. వాడు ముట్టడించలేని చోట గట్టి పట్టణం కట్టుకోవాలి ముందు ముందు.

ఇక్కడికి కొంతదూరంలో కరవీరపురముంది. వెనక పద్మవర్ణుడు కట్టిన పట్టణమది. దాన్ని ఇప్పుడు సృగాల వాసు

దేవుడు పరిపాలిస్తున్నాడు. జరాసంధుడి సామంతుడతడు. ఎగిరి పరిగెత్తే రథముందని మిడిసిపడుతుంటాడు. మనమొక సారి కరవీరపురం వెళదాం. అతణ్ణి చూద్దాం, తరవాత మీరు మధుర వెళుదురుగాని. కొత్త రాజధాని కోసం ప్రయత్నం చేద్దురుగాని, నా వెంట నా సైన్యముంది. మీ కోసం మంచి రథమూ వుంది" అన్నాడు.

"సరే" అన్నారు రామకృష్ణులు. దమఘోషుడితో రథ మెక్కారు. దమఘోషుడి సేనతో కూడా మూడురాత్రిళ్లు ప్రయాణంచేసి, కరవీరపురం చేరారు.

## సృగాల వాసుదేవుడు

బలమరాకృష్ణులు తనమీదికే ఎత్తివచ్చారని అను కున్నాడు సృగాల వాసుదేవుడు. తన ఎగిరే రథమెక్కి పెద్ద రాణువతో వచ్చి ఎదిరించాడు. కృష్ణుణ్ణి ద్వంద్వయుద్ధానికి కవ్వించాడు.

"సైన్యంతో పనిలేదు. మన ఇద్దరం సరాసరి యుద్ధం చేద్దాం. ఇద్దరు వాసుదేవులు వుండడానికి వీల్లేదు. నువ్వో నేనో తేలిపోవాలి" అంటూ కలబడ్డాడు. వాడి వాడి బాణాలు కుమ్మరించాడు. నవ్వుతూ చూశాడు కృష్ణుడు. సుదర్శనం తీశాడు. గురిచూసి వేశాడు.

మెరుపులా వెళ్ళింది సుదర్శనం. నరికి పారేసింది సృగాలుణ్ణి. రథం మీంచి క్రింద పడిపోయింది అతడి కళే బరం. కకావికలైపోయింది కరవీరసైన్యం.

